

శ్రీ

కురుమూర్తిస్వామినేనమః

# శ్రీ కురుమూర్తినాథశతకము.

—————:0:⬭:0:⬭:0:—————

శా॥ శ్రీరామామణి కౌస్తుభప్రభలతో సింగారముం జూప, నీ
శౌరాజీవదళాక్షి భూరమణి పార్శ్వంబుల్భజింపం దయా
క్షీరాంభోనిధి భక్తహృత్కుముల సుస్థేమాభిసంవాసివౌ
దౌరా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో! ౧.

మ॥ తొలినా సోమకుఁ డెల్లవేదములఁ దా దుర్బుద్ధియై ప్రుచ్చిలం
బలిమై యాతని వెంబడింప నతఁడు న్వారాశిం జొడాఁగ; నా
ఖిలునిం దుత్రించియు మత్స్యరూపమున నీఁక న్వేదముల్గాఁచునిం
దలఁతున్ శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨.

శా॥ క్షీరాబ్ధి న్మథియించి యం దమృతము న్సేవింప దైత్యుల్సురల్
మేరూత్తుంగనగంబు కవ్వముగ నిర్మింపం గఁ గాకోలపున్
ఘోరజ్వాలలఁ జూచి యదిరిపదలన్ గూర్మంబవై యెత్తినా
వౌరా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. 3.

మ॥ అవనిం జాపగఁ జుట్టి నీరధి హిరణ్యాక్షుండు క్రోయంగ నా
దివరాహాంబువుగాఁగ్ర బంటు భుని నుద్దీపింపఁగా నెత్తి దా
నవునిం జంపియు సర్వలోకభరణానంతక్రియం జూపినా
వవురా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౪.

మ॥ నరసింహాండవుగాఁగ కంబమున జన్మంబంది ప్రహ్లాదునిం
గరుణంగావ హిరణ్యకశ్యపుని వీకం జీల్చి చెండాడు నీ
పరమం బద్భుతమైన రూపమును భావంబందునూహింపఁగాఁ
దరమా నా కురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౫.

మ॥ తనభోగంబులు దానముల్గనుచు విస్తారంబు గర్వింపఁ వా
మనరూపంబున మూఁడు పాదములు నేమానన్ బలి స్వేడి, యం
తనె విశ్వంబున నిండి త్రొక్కి-తివి పాతాళంబునుంజేర, నా
తని నోయీ కురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౬.

మ॥ ఇనవంశంబునఁబుట్టి దాశరథివై యిష్టిందగంగాచి, నీ
తను బెండ్లాడియుఁ దండ్రి యాజ్ఞనడవిం ధైర్యంబుతోఁజొచ్చి భా
ర్యను గొంపోయిన రావణాసురుని శీర్షంబుల్గద్రుంచితీ
వనువొప్పంగురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౭.

మ॥ ఇలనేవేళల ధర్మహాని యగుచున్ హెచ్చౌనధర్మంబు నే
ర్పలరన్ సృష్టిని గొంచు నప్డు సుజనాహ్లాదంబుఁజేకూర్చి, దు
ష్టులశిక్షించి జగంబుఁ బ్రోతునను కృష్ణుం బార్థమిత్రు న్నినుం
దలఁతున్ శ్రీకురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౮.

మ॥ బలరామాకృతితోడఁ గృష్ణునకు సౌభ్రాత్రంబుజూపించి, చే
హలముంబూనుచు, భూమిసస్యవతియై యానందముంబొందున
ట్టుల దుష్టు ల్లయమొందునట్టులను నాటోపంబునన్నిల్చు నిన్
దలఁతున్ శ్రీకురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౯.

మ॥ గురునిన్ ఱేఁడొకరుండు చంపెనను నా క్రోధంబున న్సర్వభూ
వరులంజంపఁగఁ బూన్కితోఁ బరశువుంజేపట్టి, నిఃక్షత్రమా
సరణింజేసియు బ్రాహ్మ్యమున్నిలుపు నీ సామర్థ్యమెన్నంగ నా
తరమా నా కురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౧౦.

ములను పరిపాలించువాఁడా; దాసాగ=దాసులపాలిటికొండా; మాపా=లక్ష్మీనాథా; దాస, ఆగారి, సద్ధామ=దాసులకు ఉనికిపట్టగు శ్రేష్ఠమైన వైకుంఠమునందుండువాఁడా; సామనిధానిగా=సామవేదమునకు నెలవగునట్లు (అనఁగా సామగానలోలుఁడవై,) లేదా సౌమ్యమైన మార్గమునందు; మాగరిమన్=లక్ష్మియతిశయించునట్లు; నీపని, సరిగా, సాగనీ; ఈసారి=ఈపర్యాయము; నీసాని=నీ భార్యయైన లక్ష్మి; సమపథంగా=చంచలమార్గమును వదలి తిన్ననిమార్గమునను సరించుచుండునట్లు; మఱి=ఇంక; దారి=నిన్ను చేరఁగలమార్గము; సదా, ఆదరమొప్పన్=ఎప్పుడును దయఁగలిగినవాఁడవై; మా, దరి, గానీ=మాకు చేరువయగునట్లు చేయుము.

శా॥ స్వర్ణస్తేయము, బ్రహ్మఘాతము, సురాపానంబు, గోహత్యయున్
వర్ణాచార విసర్జనంబు గురునిందా ఘోరపాపంబులన్
పూర్ణంబౌభవదీయభక్తివలనంబోఁ ద్రోయనా నో దయా
పూర్ణా, శ్రీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౯.

శా॥ చేతంబంకముఁబట్టి సైనికడుగన్ సిద్ధించునేశుద్ధి? చే
జేతంబాపముచేసి నీటమునుఁగన్ జేకూరునే పుణ్యమున్
జేతంబందు విశుద్ధికావలయు ని స్సీ! బాహ్యవేషంబదే
లా? తండ్రీ! కురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౨౦.

శా॥ డబ్బీయంగను పాపపంకమది కట్టా! పోవునే? యేలత
బ్బిబ్బుల్? డబ్బున గల్గు పుణ్యమది తా వేఱౌను; పాపంబునుం
ద్రొబ్బనాఁదది పోవఁదోఁయునది నీతోరంపు సద్భక్తియా
నబ్బ శ్రీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౧.

మ॥ కడుగంబోవుటకేమి పాపమది పంకంబో; జలంబందుఁ దా
విడిపోపంగను మంటిముద్దయొ; కటా! వెఱ్ఱుల్ జనుల్, దానిబో

విడువంజిత్తము శుద్ధిచేయవలె, నీ పేరన్నదా ధర్మము
న్నడుపంగాఁ గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౨.

శా॥ పాపంబుల్పదివేలుచేసినను నీ పాలంబడన్వచ్చి, నీ
స్వాప్తుండౌననఁ దాక్షణంబె కడు పశ్చాత్తాపముంబొంది, నీ
కాపద్బాంధవనామమున్నదియె కాదా? శ్రీయఁగారాదెహృ
త్తాపంబుం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౩.

శా॥ చేసేతం బొనరించినాఁడ నఘముల్ చెప్పంగరానన్ని, నే
నీసాన్నిధ్యమునందె తప్పుపలుకుల్ నిత్యంబుభాషించితిన్
గాసింబెట్టకుమయ్య, బుద్ధిగలిగెం గారుణ్యమూర్తీ! భవ
ద్దాసుండన్ గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౪.

శా॥ నీపాలంబడి నీవె దిక్కనుచు నే నిక్కంబుగా నమ్మితిం
గాపాడంగలవాఁడ వీవె మఱి యొక్కండెవ్వఁడున్ లేడుఁ నా
పాపంబుల్పడద్రోసి, భక్తికుదురై వర్ధిల్లఁ బోఁ ద్రోయుము మా
నాపాట్లుం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౫.

మ॥ అవనీభారముఁ ద్రోయువాఁడవని నిన్నామ్నాయముల్సేయుసం
స్తవముల్ కేశవ, సారహీనమగు నాసంసారభారంబుఁద్రో
యవదేమీ, యది నీకులెక్కయగునే యార్తిన్దయన్మాన్పఁ బూ
నవుగానీ, గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౬.

మ॥ ఇదిగో రేపును మాపు నిల్లిదిగొనే నిత్తుంగదాయంచు నొ
ప్పిదమౌ మాటలఁ జెప్పి తప్పికొనఁగా వేషంబులంబూననే
ల? దయన్ముక్తిని గూర్పు మిప్పుడిఁక లేరా? దాతలున్నారలే
యమవశాళీ, గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౭.

మ॥ అహిరాజే నిత్యము శయ్యగాఁ దనర, సర్పాహారుఁడే యెప్పుడు
న్వాహింపన్, ఫణిహారుఁడున్నఖుఁడుగా వర్ధిల్లు నీకబ్బనే

మ॥ కరుణామూర్తివిగాఁగఁ బుట్టియు జగత్కల్యాణముంబొంచె, ని
ర్ధరభూతాళికి హింసఁబాపుమ, నితాంత ప్రేమవ్యాపింప, సు
స్థిరకీర్తిన్వెలయించు బుద్ధు నిను నేఁ జేయెత్తి కీర్తించెద
న్వరదా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౧.

మ॥ ధరలో మ్లేచ్ఛకిరాతజాతులు మదోద్ధత్యంబునన్ హెచ్చి, చె
చ్చెరహింసించెడు నాఁడు కల్కివయి వాసింబుట్టి యాదుష్టులం
దురగారూఢుఁడవై యడంపఁగల నీ దోర్వీర్యము న్మెచ్చెదం
బరమేశా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౨.

మ॥ కృతకావాసములీజగంబులుగ లోకేశా, వినిర్మించి యొ
త్తితి రూపంబుల వెన్నో; భూతములరక్తింబట్టి యాడించి తా
కతలెల్లన్విన నద్భుతంబు లిది నిక్కంబింక నీ కిచ్చెద
న్నతులన్ శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౩.

మ॥ మకరార్తింగరినాథుఁడేడ్వఁగరుణ న్మన్నించి లక్ష్మీశ, నీ
వొకని న్వెంటను బిల్వ వాయుధము నీ వొక్కండుఁజేపట్టి వో
యకలంకా! పరుగెత్తినావు, వడి నీ యావ్యాజమా ప్రేమ మి
న్నకదా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౪.

మ॥ మృగయాసక్తుఁడు, మాంసభక్షకుఁ డజామీళుండు, దుర్మార్గవృ
త్తిఁగడున్బ్రాహ్మణతేజమున్విడచి, ప్రీతింబుత్రు నారాయణుం
డగఁబిల్వన్మృతివేళ ముక్తిఁగడు శ్రద్ధంగూర్చి కాపాడితో
నగధారీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౫.

మ॥ అకలంకంబులు నీ గుణంబులు, సమస్తాశావకాశప్రభో
ధకముల్నీచరితంబ్బు, లార్తజన సంత్రాణైకదక్షంబులౌ
నిఁక నీప్రజ్ఞలు, నీదయారసముఁదా హృద్రోగముల్బాపఁబ
ధ్యకరంబౌఁ గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౬.

మ॥ జగముల్నాటకరంగముల్ జవనికల్ శశ్వద్విలాసప్రభా
ధగితాహర్నిశ, లందులోఁగలుగు భూతవ్రాతముల్ పాత్రముల్
తగనీవందులఁ గర్మసూత్రములఁ జేతంబట్టి యాడింపఁగాఁ
దగుదౌరా గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౭

శా॥ ఈ సూర్యుండును తారకల్ శశియుఁ దా మెవ్వానియాజ్ఞన్ భువిన్
భాసిల్లంగ నొనర్తు, రెవ్వని ప్రభుత్వంబుం దలంగాల్చి వి
శ్వాసంబుం బ్రకటింతు రట్టినిను భావంబందు జింతించు నీ
దాసుండం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౧౮

మ॥ కరమందొక్కటి బొంగరంబు తిరుగంగా గారడీవాఁడు బొం
గరముల్గ్రన్నిటిఁద్రిప్పు నబ్రముగఁ బ్రక్క, న్మీఁద, క్రింద; న్మహా
త్తరమౌ గారడి నీది, భూభువనముల్ తైతక్కమంచాడు నీ
యరచేతం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౧౯.

మ॥ అమిత ప్రాభవయుక్త! కంఠమున నిత్యంబున్ ధరింతీవు హా
రముగా భూభువనాళి నాఁ బరగు నా రత్నంబులంగాని, యి
ష్టములేదేనియుఁ బాఱవైచెదవు నిచ్చాసూత్రముం ద్రెంచి ర
త్నములెల్లం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౨౦

మ॥ అణువైయుండియు నంతటన్వెలసి బ్రహ్మాండాంతమున్నిండు నీ
గుణమత్యద్భుత, మందుచేతగద యోగుంబాగు నీక్షించి ర
క్షణముం జేతువు చీమనేనుఁగువలె న్సర్వప్రపంచంబు వి
న్ననువొప్పం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౧.

మ॥ అతులాకారములోడ లోకములనా యాదిత్యుఁడున్ రోహిణీ
పతియుంగన్నులుగాఁగఁ జూచుచుఁ బ్రభుత్వంబుం దగం దాల్చి, యు
ద్ధతి దుష్టాళినడంచి సజ్జనులసంతాపంబుఁ బోఁగొట్టును
న్నతి నెంతుం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౨

మ॥ కొలువంగావలె నొక్క సద్గురునిఁ గోర్కుల్ మీరఁగ సేవింపుచున్
తలపంగావలె నొక్క తెన్నుతిని విశ్వాసంబు సంపొందఁగాఁ
దలపంగావలె నొక్క దేవుని నినున్ ధ్యానించి సద్భక్తి ని
ర్మలుఁడై శ్రీకురుమూర్తి నాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౩.

మ॥ ఉపకారంబులుచేయువారు ధరలో నున్నారు వారేల? ప్ర
త్యుపకారంబో, యశస్సొ, సేవయొ, ధనంబో కోరువారేగదా!
విపరీతంబుగ నీవు ప్రత్యుపకృతి న్వేడంగఁ బోవెప్డు భ
క్తపరా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౪.

మ॥ కలికాలంబదివచ్చె, ధర్మమును తగ్గంజొచ్చెఁ, బాపంబులుం
గలయన్ హెచ్చయి మించఁజొచ్చె, నిఁకమార్గంబెద్దిలోకాళికిం
చొలయన్ముక్తిని గూర్చు దీక్షఁగొని నామోచ్చారణ న్నిన్నె నే
తలఁతున్ శ్రీకురుమూర్తి నాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౫.

మ॥ తిరమౌ భుక్తిని, భక్తి, ముక్తి, ననురక్తింగూర్చి, నీపూజకున్
గరముల్, నిన్ స్మరియింపజిహ్వ, కనఁగా కన్నుల్, సదాసేవకై
పరమేశా యొడలెల్ల, యర్పణగఁగూర్పన్ బుద్ధినాకీయ నీ
కరుదా? నా, కురుమూర్తి నాథ! సురవంద్యా! పాహి,పాహి, ప్రభో. ౨౬.

శా॥ ఎన్నో జన్మములెత్తినాను తుదకెట్టెట్లో మనుష్యుండనై
పున్నెంబంచును పాపమంచెఱిఁగితిం బున్నెంబు నీకబ్బె, నా
కెన్నండు న్సదసద్వివేచనయు సద్వృత్తంబుఁ జేకూర్పవో
యన్నా, శ్రీకురుమూర్తి నాథ! సురవంద్యా! పాహి,పాహి, ప్రభో. ౨౭

మ॥ అకలంకా వినుమయ్య, దాసులకు నే నత్యంతదాసుండ, నా
శ్వికతన్ లోకములెల్లఁ జూచెద భవ ద్విఖ్యాతిదేవేశ! నే
నిఁక నిన్నే కొలుఁతు న్మనంబునను నిన్నే నిల్పి భావింతు నా
యకమౌళీ! కురిమూర్తి నాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౮

మ॥ భరమైతోఁచెఁ గుటుంబరక్షణము, నా పాలైన్నఁగానేర, నా
ర! రహింక్ లోకకుటుంబివై యెటుల సర్వంబున్ భరింతీవు? రా
జిరమామాతయు నోర్పుతో నెటులఁదా నిం మంత్రిమోదంబు, న
య్యారె నేర్పోకురుమూర్తినాథ! సురవంద్యా! పాహి,పాహి, ప్రభో. ౨౯.

మ॥ మృతియో, జన్మమొ, యేదిమేలో యది యేరీతిన్విధింపంగ; స
ద్గతియో, దుర్గతియో, విధించుటయు నిక్కంబేరికిన్ శక్యమే?
మతి నిన్నుం దిరమొప్ప నిల్పియిటు సంసారంబుసాగింతు నా
యతితో శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. 30.

మ॥ కరుణాళుండవు నీవటంచు నరుఁ డేకాలంబు దుర్మార్గుఁడై .
చరియింపం దయఁ జూతువో క్రొ, తనదౌష్ట్యంబుం దొలంగించియు
ద్ధురభక్తిన్నిను జింతచేసియును నీతో నుండినంగాని యో
వరమిత్రా, కురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. 3౧.

మ॥ కలుషంబుల్పదివేలుచేసినను నొక్కండెవ్వఁడో నిల్చిపా
పులపాపంబులమీఁద వైచుకొనునన్ బూముల్ యథార్థంబులే?
యిలసన్మార్గముఁబట్టి పూనవలె లోకేశా భవత్పాదమం
దలి భక్తిం గురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. 3౨

శా॥ ఎవ్వండో విసెనంటు యాజ్ఞల, నతండే శాసకుండంటు, తా
మవ్వాని న్విసకున్నఁబాపులఁటు, నీధ్యానంబు చే పట్టువాఁ
డెవ్వాఁడైనను ముక్తినిచ్చెదవు, నీకీశాప్రపంచంబుఁదా
దవ్వా నా కురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. 33

మ॥ సకలాధారుఁడ వీవనంతుఁడవు, శశ్వత్కల్పసంస్థాయివా
దిఁక నేబాపిని, మర్త్యుఁడం, జడుఁడ, నిం కెట్లబ్బు జీవాత్మకో
యకలంకా పరమాత్మకైక్యమది యత్యంతంబు సంస్కారమం
దకయున్నం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. 3౪

యహివైరీ, సహవాసదోషము ద్విజిహ్వత్వంబు ? మన్నింపు ఖే
దహరా శ్రీకురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౧౮

శా॥ శ్రీయుం భూమియుఁగల్గి యిష్టజనసంసేవానుమోదుండవై
మాయ ల్మర్మములం జెలంగక, దయన్మన్నించి నీవిమ్మనన్
మాయల్పన్నుచు నర్చకుండు నిను దా మన్నింపఁడే యింతయు
న్యాయంబా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౯

శా॥ ఏమో యొప్పయటంచుఁ జేరితిని గానీ, యెంగిలిందించు, న
త్యామోదంబున నక్కలన్మెసవి, శూద్రాన్నంబు భక్షించు గో
స్వామీ, యే మొసఁగంగలాఁడ విఁక నాశన్నిన్ను సేవింతు నా
నామూర్తీ, కురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౨౦.

మ॥ తగు నీ వెల్లవరంబులం గొనఁగఁ దాత్పర్యంబునం దాచితి
న్మఁగఁడా వేడుకనుండు రా యనెదు నీమాటల్ యథార్థంబులం
చొగి నే నెట్టుల నమ్మఁగావలయు; నా మోక్షంబకాంక్షించుటల్
తగునా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౧.

శా॥ లేరాయంచును జుట్టు పట్టుకొనుచున్ లేపించుఁదా మీఁదికిన్
బోరాయంచు నధోగతింబడఁగఁ ద్రొబ్బున్; నీసతిన్నమ్మఁగా
దౌరా మాధవ, యెట్లు చంచల వశంబై యుండఁగా నేలెదో
దారన్ శ్రీకురుమూర్తినాథ ! సురవంద్యా ! పాహిపాహి, ప్రభో. ౨౨.

శా॥ ఆశారాక్షసికుక్షిదొడ్డది సమస్తాశాప్రభుత్వంబునుం
గ్లేశంబొంది యమ్రింగఁగాఁ దివురు గానీ, దాన సౌఖ్యంబు లే
దీశా నీపదచింతనంబున నరుం డే వేళ నానంద సం
కాశుండౌఁ గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౩.

మ॥ ఒకఁడున్నంబడి యుంచునుం బదియు, దా నున్నంత నూఱించు నం
తకు వేయుంచును, లక్ష, కోటియు, మహా ధాత్రీశ్వరత్వంబు, ని

ట్లోకయింతేనియుఁ దృష్టియో, సుఖమొ? సేవ్యున్నిన్ను సేవింపఁగా
నకయున్నం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౪.

మ॥ దయతో నాకును నిచ్చినావుగద సంతానంబు సద్యోగముల్
ప్రియముం జూపెడిభార్య నాప్తులను, కానీ, చిత్తమున్నిల్పనీ
పయి నొక్కింత విరామమీయవు దయావార్ధి ప్రసాదింపుము
వ్యయ, యీశా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౫

మ॥ మనసారన్నిను జింతసేయక మహాత్మా, రిత్తలౌమాటలన్
గొని యాడంగను, పూవులన్ ఫలములంగూర్పంగ నేలా వృథా
యని మూఢు ల్లలపంగఁబోవరు, ఫలం బట్లేకదా యబ్బెడున్
ధనదేశా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౬.

శా॥ కాకుల్మ్రగ్గును నేను మున్గుకును; కొంగల్చెయు ధ్యానంబుమి
థ్యాకల్పంబుగ నేను ధ్యానపరతం దాల్పుంగదా; బూడిదన్
వీకంబూయుదుఁ బూయుగాడివయు నే భేదంబుఁగాన్పింపఁద
య్యా కృష్ణా! కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౭

మ॥ తలక్రిందయ్యెను నీచరిత్రమది వింతన్నీవుశ్రీవేంకటా
చలమందున్ బయి భార్యక్రిందుగను వాసంబొప్పఁగాఁజేసి, యీ
కురుమూర్తిన్సతినెత్తిబెట్టుకొన నీకుంగల్గెనేలయ్యా, నీ
కలవాటా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౮

మ॥ కురవల్ మూఢులు, భక్తిహీనులును, మూర్ఖుల్, వారి రక్షించుటే
పరమప్రేమకుగుర్తు; జ్ఞానులకుఁ జెప్పంగానదేలా? సమా
దరమొప్పన్నిరుపేదఁ బ్రోచుటయెగాదా గొప్ప; సూనిర్మలా
త్మ, రమేశా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨౯.

మ॥ అడవింబుట్టినచెట్లఁ బెంచునెవఁడయ్యా, నింగి నాపక్షులం
గడుప్రేమంగని సాకునెవ్వఁ; డీక భూగర్భంబునంగప్పనె

శా॥ నీవున్నీనను నొక్కఁ జేయనగ యత్నింతుర్వృథాతుచ్ఛలా
హో! వాలాయముఁబుట్టి చచ్చు జనులయ్యా! 'సోఽహ' మన్మాటనే
లావాసింగను, నీపదాబ్జముల మౌళిల్ మ్రొక్కుచుంగాంతు భ
ద్రావాప్తిం గురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౩౫.

మ॥ గుణముల్లేవఁటనీకు, వాకికిని నీకున్వ్యాప్తిలేదంట; తా
మణుమాత్రంబును బాపసంగతికిఁ బోరంటోయి యో
ద్గుణసంపన్న యదెట్లో? పాపి నిఁక నీకున్భక్తుఁడం, జేతువం
దనమున్ శ్రీకురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౩౬.

శా॥ "సోఽహం" "తత్త్వమసీ" తివాక్యములచే సత్యంతమున్నిన్న కే
యూహల్పన్నుచు మోసపోదురుగదా యుత్సాహసంపూర్ణులై
సౌహార్దంబున నిన్ను జేరి భజియింపన్నాకుఁ గూర్పంగలే
వా హాయిం గురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౩౭

శా॥ దేవున్నైన గురువున్నహీయనెడు నాదిట్టలు రాచారపుం
బ్రోవు ల్మన్నను మిన్నఁగానక తుదిం బొందంగఁ బోఁ గొక్కుదు
స్సైవన్నారక ఘోరబాధలను, నం జేర్పంగఁబోకోయి, భ
క్తావాసా, కురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో! ౩౮

మ॥ ఖరముల్బూడిదలోనఁ బొర్లినను, గాకంబుల్నదీస్నానత
త్పరతన్మించిన, నెద్దకుంజురకల న్నైవంగ, నిష్టాత్తని
గ్ఘరముల్గావని; బాహ్యవేషములు వ్యర్థంబుల్ భవద్భక్తియే
ధర హెచ్చుం గురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౩౯.

శా॥ శీలంబుంగుణముంగలట్టి పురుషుల్సేవింపఁగా నెప్డు, రే
వేళంబట్టెలుతీర్చి బొట్టులిడుచుం బేరాసనల్లాడునా
లీలాచారుల కేలఁగల్గు భగవ ల్లీలానుమోదంబు, రా
ధాలోలా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౪౦.

మ॥ జపముల్, హోమములుం, దపంబులును, నిస్సారంబులెవ్వేళ, నీ
యుపచారంబులఁ జిత్తమున్నిలిపి, యత్యుత్సాహసంపన్నులై,
యెపుడుం బీనులఁ గాంచి మొప్పుటయె తా నిష్టార్థసంసిద్ధికా
త్తపథంబౌఁ గురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౪౧

శా॥ పశువై పుట్టుట మేలు మానవుఁడు నీ పాదార్చనాసక్తి లే
క శవంబై మనుకంటె; నా పశువునొక్కండైన నీచింతనా
వశచిత్తంబునఁ గాదె ముక్తిపగతిం బ్రాపించు; వద్దయ్య దు
ర్దశనాకో కురుమూర్తినాథ సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౪౨.

శా॥ దానంబు, ల్జపముల్, తపంబులును, నిత్యస్నాన సంధ్యాదు లే
లా, నీసేవలఁ జేసి, నిందలఁ జి, నీకై సర్వమున్వీడి, తా
నానందాశ్రుసుపూర్ణ నేత్రయుగళుండై చూడలేకున్న, ని
త్యానందా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహి,పాహి, ప్రభో. ౪౩.

శా॥ నీ తుల్ చెప్పఁగ వచ్చుఁ గాని మదిలో నిన్నెంచి, ధ్యానించి, ని
ర్భీతిం దానొకఁడైన సత్యపథవర్తిత్వంబున న్మించినన్
ఖ్యాతిం జెందఁడె? యల్లెయ్యుంచి నను నెక్కాలంబుఁ జేకూర్పు వి
ఖ్యాతిన్ శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౪౪

మ॥ నుతియింపంగను, జేతులెత్తఁగను, నిన్నుం బూజసేయంగనే
ర్పితి; యాత్రా, వ్రత, దానముల్ సలిపి తీ స్సీ! చిత్తమొక్కింతని
ల్పితి నన్మాటయొ లేను, జెట్టినయితి న్విశ్వేశమన్నింపుము
ద్ధతునిన్ నన్ గురుమూర్తినాథ! సురవంద్యా! పాహి, పాహి, ప్రభో. ౪౫

మ॥ విపరీతంబగు నీ ప్రపంచమున నేవేళన్నదా చాయ ల
ల్పపువారెప్పుడు బాధపెట్టి, పడియుబ్బందిన న్మనంబుంగు, బా
పపుఁద్రోవం బడకుండ నిన్నెతవుల న్వాంఛింపఁజేఁ జిక్కవ
య్యా, పరాకా? కురుమూర్తినాథ సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౪౬

మ॥ ఇదిగో యిచ్చటడాగినావె గుహలో నీశా, కనుంగొంటిలే
పదవయ్యా యిట గోపికాజనముతో బాలుండు లేడంచుఁజె
ప్పెదలే యమ్మయశోదతో, నయిన నీ వేమిచ్చెదో తెల్పుమో
యదుబాలా కురుమూర్తినాథ సురవంద్యా! పాహి,పాహి,ప్రభో. ౪౭

మ॥ ఇదిగో యిచ్చట డాగినావె గుహలో నీశాకనుంగొంటి వ
ట్పద మాతావినిబట్టి చేరదొకో పుష్పంబుగ్; శరీరంబు నె
మ్మదిగా డాచిన నేడడాగు మహిమల్ మన్నించి చేకొమ్మి నా
థ! దయాబ్ధీ! కురుమూర్తినాథ! సురవంద్యా! పాహి,పాహి,ప్రభో. ౪౮

మ॥ ఇదిగో యిచ్చట డాగినావె గుహలో నీశాకనుంగొంటి, నీ
మదిలో ని న్వదలం గలాఁడ నని వేమాఱుం దలంపంగఁబో
యెదవేమో, యివె భక్తి రజ్జువులు నీ యిష్టమ్ము తర్వాత నే
మదియౌనో, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహి,పాహి,ప్రభో. ౪౯

మ॥ ఇదిగోయిచ్చట డాగినావె గుహలో నీశా! సమానుండఁగా
నిదియు న్సఖ్యతఁ బెంపవేమొ? యయిన న్నీతో సమానుండనే
కద, శ్రీభక్తవశ్యమైన నాకుఁ గలదెకాలంబును న్భక్తిసం
పద యోయీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి,ప్రభో. ౫౦

మ॥ ఇదిగో యిచ్చటడాగినావె గుహలో నీశా కనుంగొంటి నే
వదలంబో నిఁక, నప్పుగాఁ గొనుమ నాథ క్తిం, గిరింజొచ్చితి
చ్చెదవా వడ్డిని ముక్తినైన, నిఁక నీసిగ్గెల్లయుం దీసెదం
గద యోయీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫౧

శా॥ లుబ్ధాగ్రేసరచక్రవర్తివయి తే లోపమ్మువాటిల్లె, బ్రా
రబ్ధంబో గిరిడాగ భక్తజనసంరంభంబు వీక్షించి, నీ
లుబ్ధత్వంబును జాటెదన్ భువిని వీలుంజూచి రాకున్న, ము
క్త్యబ్ధీశా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫౨

మ॥ గిరిలో నెందుకు డాగినావొ తెలిసెన్ గేహంబునం దెప్పుడుం
దిరుగం జొత్తురు భక్తు, లింక సతితోఁ దియ్యంబునన్ముచ్చటల్
నెరపం దీరిక లేదు నీకయిన గానీ నన్ను రానిమ్ము నీ
దరికిన్ శ్రీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౩.

మ॥ కిటివై శ్రీ నరసింహమూర్తివయి శక్తిం దుష్టులంగూల్చి, యం
తటఁ జాలించితి; కాని, యద్రి గుహల న్నానావినోదక్రియా
పటుమోదంబును బొందలేదనుచు నిప్పాటంగుహ న్నిల్చినా
వఁటకాదా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౪

మ॥ అలవైకుంఠపురంబునం గలుగ ధావంతైన చో టెప్పుడుం
గలయన్నిండెను భక్తసంహతులచేఁ గానన్ స్థలంబొక్కటీ
యిలవైకుంఠముగాఁగ నిల్పుటకునై యియ్యద్రినుందంచు నేఁ
దలఁతున్ శ్రీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౫.

మ॥ అరుదౌనట్టుగ నద్రి నిల్చితివి భద్రాకారముం దాల్చి, ము
క్కుర వంశంబును భూమిపైఁ జిరయశ, స్కల్పంబుగా నిల్పి, నీ
పరమప్రేమను జూపి కాఁచుటకునై భద్రంబులంగూర్పు మా
దరమొప్పం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౬

మ॥ గుహలోనెందుకు డాగినావొ యిపుడే గుర్తించితిన్నాథ, నీ
మహిమం గానఁగలేక నమ్రితను నిన్మన్నింపఁగా రాని వా
రిహమందుం దలవంచి కాంచుటకునై యీయెత్తునుం బూనితో
యహినాథా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౭.

మ॥ ♦ సరిగా నీపని సాగనీ గరిప, దా, సాగారి సద్ధామ! మా
గరిమన్ సామ నిధానిగా, సమపథంగా సాని నీసారి; మా
దరిగానీ మతిదారి; సన్నిగమపా! దాసాగ! మాపా! సదా
దరమొప్పం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౮

---

♦ గరిప=గరుత్మంతునికి ప్రభువా; సన్నిగమపా=శ్రేష్ఠములైన వేద

వ్వాఁడు రక్షించును; నీవునుండగను నివ్వాన్ లాగికొ నేరికిం
దరమే శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭౦

శా॥ ఏమో, యెచ్చటనో, యదెట్టులనో, తానెవ్వాఁడెఱుంగు న్మగిన్
మోమోటంబొక కాలకింకరులకున్ మెట్లో, కుయో, యన్న వా
రేమీ యూరకయుందుగో భయముచే నేడ్వంగ దిక్కౌను నీ
నామంబే కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭౧

శా॥ అమ్మా యెన్ననె పెండ్లియయ్యెనన, భాగ్యంబెల్లఁ బోనాడతే
నమ్మా యన్నను, క్షేత్రమందిరమునం దావాసమోయన్న, నే
వెమ్యాలుల్గొని యిత్తునన్న నిఁకఁ దప్పింపంగ శక్యంబె, చా
వమ్మా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭౨

శా॥ చేతంజిక్కియెయున్నవాని నిను నే సేవింప కెందెందునో
భీతిందిర్మ్మరు మూఢమానసుఁడ; తెల్విన్వీడి గొల్లందు తాఁ
జేత న్మేఁకను బట్టి దానికయి గాసి న్వ్యాధులందిగ్గెనన్
భాతిన్ శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭౩

మ॥ నిలువంజాలదొకింత యొక్కయెడ; దా నిత్యంబు మోహాటవిం
జరియించున్; యువతీస్తనంబులను కొండల్పట్టిపారాడు; నీ
యిలయంతం దిరుగాడు చిత్తమను నా యీ కోతి బంధింపఁగాఁ
దరమా నా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭౪

మ॥ సరియే కోటి మిణుంగురుల్ రవికి; నక్షత్రంబులెన్నైనను
న్సరియే చంద్రునికెన్న; జాతిమణికి న్సాజాత్యమే కాళ్ళకున్;
సరియే చిల్లరదేవతల్ దివిజరక్షాదక్షుఁడా నీకు నె
త్తరినైనం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭౫

శా॥ మంటల్లేచునెయిందు బింబమున; సంద్రం బెన్నడే నిండు నే;
దంటల్వీరులు భీతిఁజెందుదురె యుద్ధంబందు; నీపాదపున్

జంటన్ సృష్టిస్థితిప్రళయకారియును నా సందేహముం బోదునే;
దంటా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫౬.

మ॥ కలుషధ్వాంత దివాకరం; బమృతమార్గ స్వచ్ఛదీపంబు; ని
శ్చల తాపత్రయ దాహపావకము; సంసారాబ్ధిపోతంబు; ని
ర్మల కల్యాణ ఫలప్రదంబగును నీనామంబహో భక్తవ
త్సల ! శ్రీశా ! కుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫౭.

శా॥ శ్రేయస్సాధకమై, తపఃఫలదమై, క్షేమంకరంబౌచు, దీ
ర్ఘాయుర్వర్ధనమై, రుజాపహర్తమై యారోగ్యసంధాయియై,
శ్రీయుం గీర్తియు న్నియ్యఁజాలుఁగద నీసేవాపరత్వంబు సు
స్థాయిన్ శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫౮.

మ॥ చలిపందిళ్లొనరించియుం జెరువులన్ సత్రాన్నముల్ పెట్టియున్
కొలఁకుల్ద్రివ్వి చరాచరమానవులపైఁ గారుణ్యదృగ్జూపి ని
శ్చలమౌ నీ పదభక్తి వీడక సదాచారుండు ముక్తిఁగాంచం
గలఁడోయీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫౯

శా॥ స్వామీ నీదుమహత్త్వముల్దెలియఁగా శక్తుండఁగానయ్యా, వి
ద్యామాంధ్యుండ, జడుండ, నీచుడను, వీతప్రజ్ఞుఁడన్, దేవ, నీ
సామర్థ్యంబు విరించిముఖ్యులయినం జర్చింపఁగాలేరు, నీ
లామూర్తీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౦.

మ॥ కలుషాభీల దురంతశోక భవదుఃఖంబు ల్నివారించి, యు
జ్జ్వల కల్యాణ పరంపరాన్వితునిఁగా సౌభాగ్యవర్ధిష్ణుఁగాఁ
గలిత శ్రీనిధిగా నొనర్పఁగదవే, కల్యాణమూర్తీ, విని
ర్మలవేషా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬౧.

శా॥ ఆధి వ్యాధి సమావృతుండ భవభారాధీనుఁడన్, దీనుఁడన్,
బాధాయుక్తుఁడ, నే నకించనుఁడ, దుష్పాపాకులస్వాంతుఁడన్,
క్రోధా ద్యావృతుఁడన్, జడుండఁ శఠుఁడన్, క్రూరుండ, కష్టుండ, నో
నాథా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౨.

శా॥ నీకన్న న్మఱి దైవ మెవ్వఁ డిలలో నీకన్న దిక్కెవ్వఁడు
న్నీకన్నం బ్రభు వెవ్వఁ డార్తిహరుఁడు న్నీకన్న నెవ్వండు, నీ
వాకాశంబున, భూమి, నెల్లయెడలన్ వ్యాపించి రక్షింతు వా
నా కాదా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౩.

మ॥ భృగుపాదోపహతిం జలింపక మునిం బ్రేమించి పాదంబులొ
త్తఁగఁ గోపించి రమావధూమణియు నిందాలాపముల్జేసి పో
వఁగ నీవున్ గరవీరపట్టణము క్రేవన్ శేషశైలంబుపైఁ
దగనిల్తో కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౪.

శా॥ పుట్ట న్నిల్వఁగ బ్రహ్మయు న్సురలు గోవుల్గాఁగ జన్మించి, నీ
పొట్టం బాలను పోయ, గొల్లఁడు నినుం బుద్ధి న్విచారింపకే
కొట్టన్ రక్తము కాల్వలయ్యె నపుడా గొల్లండు తాఁజచ్చె నిన్
బట్టంగా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౫.

మ॥ గురుఁడున్ గాయమునా న్వనీకు నటునా కొండ న్వరాహంబుతో
డ రహిం బోరియు నిల్చి, యొక్కయెడ వేఁటన్ నీవు పద్మావతిన్
స్థిరదృష్టిం గనుగొంచు నామెపయిఁ బ్రీతిన్నిల్పి నిల్పోపవై
తిరుదారం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౬.

మ॥ వకుళం బంపఁగ నామె రాజతనయా ప్రస్తావనం జేయుచున్
సఖియల్ జెప్పఁగ నామెమోహమును, నీ సాన్నిధ్యమం దెంచె; నే
డుకతోఁ బుల్కసిరూపువం జనితి వాటోపంబున న్నాతియొ
ద్దకు నోయీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౭

మ॥ అటు నా కాంతకు నా మెతల్లికిని సత్యామోహముం గూర్చి, ము
చ్చటలం జెప్పుచు శ్రీనివాసునకు నిచ్చుం గన్య నిమ్మన్న, వా
రటు శ్రీవేంకటశైలవాసినగు నీ కారాధనల్జేసి రం
తట వేడ్కంగురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౯౮

శా॥ నీ కల్యాణమహోత్సవంబు కడు నిర్విఘ్నంబుగా బ్రహ్మయుం
న్నాకేశుండును నాదిగా సకల సన్నాహంబుతోఁ జేయఁగా
వీక్షం బ్రేమసి పొందఁగూడి తిటు సర్విన్ భక్తులం గాచుమన్
వైకుంఠా, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౯౯.

మ॥ కురవగ్రామనివాసి కుమ్మరియు నీకున్ భక్తుఁడు న్నిత్యముం
దులసీదామము మృణ్మయం బొసఁగ సంతోషించి యవ్వానికిం
బరమప్రేమను ముక్తినిచ్చితివి; నీ వాత్సల్య మేమెంచఁగాఁ
దరమా శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౦౦

మ॥ కురవగ్రామమునందుఁ గుమ్మరికి వైకుంఠా భవద్రూప ము
చ్చెరువొప్పం గనఁజేసి యంత నిలువన్ సిద్ధించెఁ గుర్మూర్తినా
మరుదాపే, రది దివ్యమై యొసఁగు సేవ్యంబై పవిత్రంబునై
నరమితాద్రి, కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౦౧.

శా॥ దేవా యీజగమెల్ల పాపమయ, మాధివ్యాధి సంపూర్ణ, మీ
ద్దావాసంబు, సమస్తదుర్గుణకుల వ్యాలోలమై తోఁచెడిన్
నీవాత్సల్యముఁ జూపి ప్రోవవలె మన్నింపన్వలె న్నాథ, భ
క్తావాసా కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౦౨.

మ॥ జగమెల్లన్నిదురించు నింక జగదీశా, మేనులుం బొన్న పైఁ
దగ ప్రాలున్ స్పృహతప్పి, రక్షణ మనంతా కూర్పవే; తెల్వియుం
వగ నిన్నేమియుఁ గానకుంటిమి, క్షమింపం గావలెంజుమ్మీ, మా
వఁగరా దో కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౦౩.

మ॥ ఇదిగో బల్బల తెల్లవారినది నీ యిష్టప్రకారంబుఁ జే
సెద నా కృత్యముల న్మహాప్రభువ నిం జింతించి సేవించుచుక్
మదిలో నించుక ప్రేమఁజూపి కరుణింపంగావలెం దాసు న
య్య దయాబ్ధీ కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి,ప్రభో. ౧౦౪.

మ॥ నను లోకుల్ శతమూర్ఖుఁడంచుఁ దలఁచు న్నాపాపముల్ తీరె నా
మనమే యింకను నిన్ను నిల్చి యటనే పాడంగ భాగ్యంబగున్
వినవే నన్ను నకారణంబుగను సేవింపన్ నిజంబాయె నో
య్యా, నీవే కురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో.౧౦౫

కరుణాసాగర నీవు కల్గ మది నింక న్నాకు జంకేల, నీ
పరమప్రేమయు నాయెడంగలుగ నాపన్నుండఁ గానేల; ని
ర్భరమౌ నీ కృప కల్గ నించుక ననుం బాధింపఁగా నేర ర
వ్వయు యేమం గురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో౧౦౬

మ॥ న్వమ్మువాఁడయితే జనుండు చెడఁ డన్నా, నమ్మకున్నట్టి నాఁ
డెమార్గంబుననైన బాగుపడఁ డోయీశా, సదా నీదుధ్యా
నమ్ముం జేకురఁ జేయుమయ్య వదలంగాఁబోను నీ పాదప
ద్మమ్ముల్ శ్రీకురుమూర్తినాథ! సురవంద్యా! పాహిపాహి,ప్రభో. ౧౦౭

ఛందోవ్యాకరణాదిసంగతులు పూజ్యంబయ్యె, నీపైన భ
క్తిం దాఁ జేతము నిక్క దగులొ్ఱనఁగఁ బ్రీతిం గూర్చినా నెట్టులో
నిందార్హంబని తోఁచ కీకృతిని, మన్నింపందగున్ శాశ్వతా
నందా శ్రీ కురుమూర్తినాథ ! సురవంద్యా! పాహిపాహి, ప్రభో. ౧౦౮



శ్రీసుజనరంజనీముద్రాక్షరశాల, రాజమండ్రి.

